

Refund

శ్రీ

231. To the Maharajah of Venkatagiri
Venkatagiri Town P. O.
Nellore Dt.

Reg. No. M. 2580



జమీందారీ రయితుల ఆర్థిక సాంఘిక వ్యవసాయిక భాగ్యోదయమునకు.

సంపుటము ౨ } శనివారము ౨౯-౧౦-౩౨ నెల్లూరు } సంచిక ౭-౮

వెంకటగిరి రాజాగారి కళాశాల పరిపాలన యెడల అసంతృప్తి ప్రబలముగ వ్యక్తమగుచున్నది. కమిటీవారి విధానము, అయోమయమై మార్పుసహించని సంకుచిత స్వభావమునకు నిదర్శనముగా కనుపించుచున్నది. తీవ్ర విమర్శనములు వెలువడుచున్నను, అధికారుల నిరంకుశత్వమును ప్రజాభిప్రాయము స్పష్టము [illegible] గించుకొనుచున్నను, కమిటీ సభ్యులు, [illegible] ను కనుకూలమగు యోగనిద్రనుండి మేలుకొన దలచినట్లు తోచదు. వీరి నడవడి రోమ తగులబడుచుండ సంగీతము పాడుకొనుచు కూర్చున్న 'నీరో' చక్రవర్తి ననుకరించుచున్నది.

* * *

కమిటీసభ్యులు శాశ్వతముగ పదవు స్థానముల నెలకొనుటకు కవసరమగు వసతులన్నియు నిబంధనల యందున్నవి. సభ్యత్వమును వంశ పారంపర్యముగ నొనరించుట మాత్రమే కావలసినవారిప్పు. ఉపాధ్యాయులు అధికార వర్గము వారి బంధుకోటిలో నుండవలయుననుట సిద్ధాంతము నందులేని యాచారము.

* * *

అధికారము నందుండువారు స్వల్ప [illegible] మార్పులకు సమ్మతించుచ్చు గింపని దున హైస్కూలు కళాశాల ప్రాత విద్యార్థులయందు కక్షలేర్పడినవి. కొన్ని సంవత్సరములనుండియు ప్రాత విద్యార్థి సంఘ సాంవత్సరిక సమావేశములను రెండు సంఘముల వారును ప్రత్యేకముగా జరుపుకొనుచున్నారు.

* * *

గతసంచికలో రంగను రాయుబడ్డయైన విఘ్నము అనుకక్ష, కళాశాలా నిర్వహణమును గూర్చి వ్రాయబడినట్లున్నది. నెల్లూరు పౌరులు, ముఖ్యంగా ప్రాత విద్యార్థులు కళాశాల నుద్ధరింప నడుముకట్టిన యెడల రంగడు రాతిలో దూరియుండక యేమించేయగలడు.

* * *

ఓటర్ల జాబితాలు కొన్నిచోట్ల విచిత్రముగా జరిగినవి. కందుకూరు తాలూకాలో ఒక పార్టీవారు సుమారు 150 మందిని చేర్పించ జూస్తే రెండవ పార్టీవారు 400 మందిలకు ప్రయత్నించారట. కాని, ఎలెక్షను ఆఫీసరుగారికి 400 అప్లికేషన్లలో ఒకటీ సరిగా వుండినది కనుపించలేదట. 1500 లలో మాత్రము ఒక్కపొరపాటయిన లేకపోయినది. (నార్యాయుపేట సర్కిలులోకూడ యిదేరీతి రెండు పార్టీలు. అప్లికేషను సరిగా వ్రాసుకోలేని పార్టీ, తప్పులే యెరుగని పార్టీ) ఈ

(తరువాయి 8-వ పేజీలో చూడుము.)

## వెంకటగిరి రాజుగారి యున్నత పాఠశాల.

పఠనీయగ్రంథ నిర్ణయ విధానము.

—(౧)—

తన యాజమాన్యమున నుండు వేర్వేఱు తరగతుల బాలురకు పఠనార్హమైన గ్రంథముల నిర్ణయించుట ప్రధానోపాధ్యాయుని ముఖ్యధర్మములలో నొకటియై యున్నది. పైపేర్కొన్న పాఠశాలయందు మార్చి మాసాంతమునగాని, ఏప్రెలు మాసారంభమునగాని ప్రధానోపాధ్యాయుడును, తక్కిన సహోపాధ్యాయులును సమావేశమై రానున్న వర్షమునకు ఒక ఆరవ ఫారమునకు తప్ప తక్కిన ఫారములకు పఠనీయగ్రంథములను నిర్ణయింతురు. పెక్కండ్రు ఈ విషయముకూడ చర్చనీయమా యని సందేహింపవచ్చును. నిజస్థితి తెలియని వారు, ఉపాధ్యాయులు తమ కుచితముగా నూవరికి పంపబడు పుస్తకములను చదివి, వానిలోని గుణదోషముల నిర్ణయించి ఆయా సంవత్సరములకు ఆయాతరగతులకు పఠనీయగ్రంథముల నేర్పఱచుటలో నేమి కష్టమున్నది, ఏమి మోసమున్నది, ఏమి ద్రోహము జరుగుచున్నది, ఏమియు కనిపించుటలేదేయని సునాయాసముగ తలచవచ్చును. ఒకించుక యాసక్తిగొని పై పాఠశాల విషయముల తెలిసికొని యాలోచించితిమేని అచ్చటజరుగు "దురంతములు" తేటతెల్లమగాకపోవు. ప్రధానోపాధ్యాయుడును తక్కిన యుపాధ్యాయులలో యతేని ముఖ్యయనుచరులును విద్యార్థులకును వారి తల్లిదండ్రులకును ప్రతిమేటగావించు ద్రోహమును ప్రతి పౌరునికి ఈ పత్త్రికాముఖమున తెలియజేయనియెడల వ్యాసకర్త-విద్యార్థి పితృప్రపంచకమునకును, ఈ పురవిద్యాభివృద్ధికిని తనధర్మమును నెఱవేర్చకపోయిన వాడగును. ప్రస్తుతముచదువరిని పెక్కు యుదాహరణములనిచ్చి బోధింపకమునుపు ఈ నేటివి రెండుసంగతులనె ప్పివివరించెదను.

1. ఈయేడు నాల్గవ ఫారమునకు తెలుగు పఠనీయ గ్రంథములలో శ్రీ దీపాల పిచ్చయశాస్త్రిగారి రఘువంశము ద్వితీయ భాగము" ఒకటి. ఇది శైలికఠినమనియు, ఈచిన్నఫారమునకు పఠనానర్హమనియు, ఏ వివేకికైనను స్ఫురించును. ఈగ్రంథపు ప్రథమభాగమునే మన ఆంధ్రవిశ్వకళాపరిషత్తువారు " ఇంటరుమీడియటు " పరీక్షకు నవశ్య పఠనీయగ్రంథముగ నుంచియున్నారు. ఇక విపుల వ్యాఖ్య యనవసరము. ఒకే గ్రంథకర్త యొకేసందర్భమున నొకేయుద్దేశ్యముతో వ్రాసిన పుస్తకపు ప్రథమభాగము ఇంటర్మీడియటు విద్యార్థులకు నవశ్య పఠనీయ గ్రంథముగను దాని ద్వితీయభాగము నాలుగవ ఫారమువారికి సాధారణ పఠనీయగ్రంథముగ నున్నది. ఇకమన పఠనీయగ్రంథ నిర్ణేతల విచక్షణాశూన్యత మెంతయు తేటతెల్లము. పై విషయములో నొకటి విశదమగుచున్నది; ఏమన, నాలుగవ ఫారమునకు తెలుగును బోధించు యుపాధ్యాయుల సలహాలను అధికారులుపొంది యుండలేదని వారి యభిప్రాయములను ముందు తెలిసికొనియుండినచో, ఇట్టియవివేకపు పనిని వీరుచేసియుండరు.

2. ఐదవఫారపు ఇంగ్లీషు పఠనీయ గ్రంథముగా మాక్మిలన్ కంపెనీవారిచే ప్రచురింపబడిన "దుర్గాదాసు, రథోరు"ను మనపాఠశాలాధికారులు నిర్ణయించిరి. ఈ జాతీయోద్యమపు దివసములలో నింకను మాక్మిలన్, లాంగుమాన్సు కంపెనీల నేల మనపాఠశాలవారు ప్రోత్సాహపఱచుచున్నారో బోధపడుటలేదు. బహుశః ఆయావివిధ కంపెనీల ఏజెంట్లు ఒత్తిడి దుర్భరముగా నున్నదేమో? ఈ గ్రంథముగూడా చాలకఠినమైన శైలిలోనున్నది. బాలురకు అవశ్య పఠనీయ గ్రంథముగా నుంచదగినదిగాదు. విశ్వవిద్యాలయ పట్టభద్రుడగు నీవ్యాసకర్త యొకవిద్యార్థికి దీనిని బోధింపబూని స్వానుభవమును బొంది యున్నాడు. ఆయుత్కృష్ట రాజపుత్రయోధుని నామమును అట్టిమీదగాంచి, ప్రథమ ప్రకరణములో ప్రథమపుటను చదివినమాత్రముననే ఈ పుస్తకమీ తరగతివారికి పఠనానర్హమని కించిత్ జ్ఞానము గలవానికైనను తోచును. ఈ పుస్తకము ఈ తరగతి కెంతయు తగదు. శైలిమృదుమధురముగ పాఱుటలేదు. బాలునికి నిఘంటువును పెక్కుసారులు వెదకికొనవలసిన యవసరమేర్పడుచున్నది. విద్యార్థి దృష్టిని పుస్తకము లేశమాత్రమును నాకర్షించుటలేదు. పుస్తకమును చదువ మొదలిడిన తర్వాత ఎంతశాంత స్వభావులైనను, అమృతాంజనము దగ్గఱలేకపోయెనేయని చింతించి, తర్వాత సహజ శాంతమును గోల్పోయి నిర్ణేతోపాలంభమునకు దిగుచున్నారు. ఇకనిట్టి పుస్తకమును మన 'నెల్లూరి' బాలురెట్లు చదివి, అర్థముగ్రహించి శైముషికలాభమును పొందెదరో యూహింపనలవికాకయున్నది. దీనినిబట్టి జూడ, నిర్ణేతల తొలతపుస్తకములలో మొదటి పుటనైనను చదివి యుండలేదని తెలియుచున్నది.

ఆంధ్రాంగ్ల గీర్వాణములయందు "నాన్ డిటైల్డు" అనగా అవశ్యపడనియ గ్రంథములు కాని వానిని నిర్ణయించునప్పుడు, బాలుడిదివఱకు నేర్చియుండు పదసముదాయమును మఱచిపోక వివిధగ స్వంతముగ నుపయోగించు శక్తినిపొందుటకును, వేగముగ చదువుటకు నేర్చుటకును, ఆయావాఙ్మయముల చదువుటయందెక్కుడు యభిరుచిని కలుగజేయుటకును, అను నీమూడు ముఖ్యోద్దేశ్యములను నిర్ణేతల గమనించవలయును. ఇట్టి యుద్దేశ్యములు మన ఒజ్జలలో ఎవరియందు లేవని బోధపడుచున్నది. సైదాపేట, రాజమహేంద్ర

(దీనికొరకు 7-వ పేజీలో చూడుము.)

## ఏజంట్లు కావలెను.

ఆంధ్రజమీందారీ లన్నిటిలోను మా జమీందారీ రయితు పత్రికకు చందాదారులను చేర్చుటకు ఏజెంట్లు కావలెను. ఉత్తర ప్రత్యుత్తరములు నాతో జరుపవలెను.

మంచికమీషను ఇయ్యబడును.

మేనేజరు.
"జమీందారీ రయితు"
నెల్లూరు.




## ఎస్టేట్సులాండుయాక్టు సవరణ చట్టము.

### సెలెక్టు కమిటీ నివేదిక.

శ్రీయుతులు ఏ. గి. సుందరవరదులు గారిట్లు వ్రాయుచున్నారు.

ప్రభుత్వమువారిచే గత జనవరి 26 వ తేదిని చెన్నపురిశాసనసభలో ప్రవేశపెట్టబడిన మదరాసు ఎస్టేటులాండు సవరణచట్టము నాలోచించుచుండిన సెలెక్టుకమిటీ వారి నివేదిక గతవారము ప్రకటింపబడినది సెలెక్టుకమిటీయొక్క తీర్మానములెటుండునను తత్సంఘ నిర్మాణము నొకమారు పరిశీలనమొనర్చిన స్పష్టపడగలదు. సెలెక్టుకమిటీయందు అర్గురు జమీందార్లను ముగ్గురుజమీందార్ల న్యాయవాదులును రైతుప్రతినిధులిద్దరును గలరు. తతిమంది ద్దఱకును జమీన్ రైతుల యనుభవము గాని, ఎస్టేట్ల పరిజ్ఞానము గానీ లేదని చెప్పవచ్చును. ఇట్టిపరిస్థితులలో రైతులకు న్యాయముకలుగ లేదని విచారపడవలసిన యవసరముండదు. ఈయుపసంఘనిర్మాణము సంతృప్తికరముగ లేదని ప్రభుత్వము వారికెన్ని మార్లు విన్నవించినను వారిచెవికెక్కలేదు. అందుచే సెలెక్టు కమిటీ నివేదిక రైతులకేవిధమైనఉత్సాహమును పురిగొల్పుట లేదని నచో నాశ్చర్యముండదు. బిల్లులో సవరణలు, వానికి కమిటీవారు గావించిన మార్పులు రయితుల భావ్యభివృద్ధిని నిరోధించుచుండెనని నిరూపించుటకు రెండు మూడుదాహరణములను సూచించెదను.

### చెట్లరుసుము.

రయితాధీనము లోనుండు భూమియందుగాని, పోరంబోకు మోగాని, ఉండుచెట్లకు ప్రత్యేక రుసుమును విధించుహక్కు నికను యీసవరణ చట్టము భూస్వామికొసగుచున్నది. భూమికి వత్సరప్రతి వత్సరమును, రయితు పన్ను విధించుహక్కును నిరూపించుట కేవల మన్యాయము. రయితు త్వారీ భూములలో యిట్టిపద్ధతి లేదు. పోరంబోకు లోనున్న చెట్లను గ్రామ సముదాయముమీద అనుభవించుటకో, లేక గ్రామ పంచాయతీల యనుభవముకొరకో వదలిపెట్టుట న్యాయముకాని ఆచెట్లను రయితులకు ప్రత్యేకముగ పట్టాక్రింద నొసగుహక్కును భూస్వామికొకను యొసగియుండుట విషాదకరము. ఇంతకంటె దారుణమగు మార్పు నొకటి సెలెక్టు కమిటీ గావించియున్నది. ఇంతవరకు చెట్లకు కట్టవలసినపన్నును సివిలు కోర్టులోదావాచేసి పుచ్చుకొనవలసియుండెను. సివిలు కోర్టులలో కొంచము ఆలస్యమైనను న్యాయము జరిగెడిది. అదియుగాక భూస్వామి అట్టిపన్నును విధించుటకు తనకుగలహక్కు భాధ్యతల నచ్చట నిరూపించ వలసియుండెను. ఇప్పటి సవరణ ప్రకారము భూమిసిస్తువలెనే చెట్లరుసుములనుగూడ రెవిన్యూ కలెక్టరువద్ద దావాచేసి సమ్మరీ పద్ధతిని వసూలు కలుచవచ్చును. రెవిన్యూ కోర్టులందు రయితుకు సరియైన న్యాయము కలుగజాలదని రయితు లెన్నియో మారులు మొరబెట్టుచుండిరి. ఇచ్చట నిరూపణభాధ్యత సాధారణముగ రయితులపై మోపబడుచుండును. అందుచేతనే రైతు బిల్లులో ఎస్టేటులాండు అక్టుక్రింది ముఖ్యమైనవి వాదములన్నియు సివిలు కోర్టులలో పరిష్కరింపవలసినదిగ సవరింపఁబడెను.

### ఇనాం యేస్టేటు.

ఇనాందేస్టేటు గూడ 1908-వ సంవత్సరపు ఎస్టేటులాండు క్రింద పాలింపబడుచుండెను. కాని కోర్టు తీర్మానములు ఆక్రమణ బాధ్యతను నిరూపించు భారము రైతుదని నిర్వచించియుండుటవి ఈతీర్పులు అక్టుయొక్క ఉద్దేశమునకు ప్రత్యక్ష విరోధకరములు గావున అట్టానిని సవరించుటకు ప్రభుత్వపు బిల్లు ప్రయత్నించెను. సెలెక్టుకమిటీలో ఇనాం ఎస్టేటు అసలీచట్టముక్రిందికి రాజాలవని నిర్వచించిరి. ఇయ్యది రయితుల నమితముగ బాధించునని వేరుగ నుడువ నక్కర లేదు. ఇనాం గ్రామరయితులకు అక్రమణ భాద్యత యిందువలన జారిపోవుచున్నది. భూస్వామి తన కిష్టమువచ్చినవారికి, రేటును ఎచట మార్చి భూములను యివ్వవచ్చును. ఈమార్పు రాజధానివ్యవసాయాభి వృద్ధికి ప్రబలమగు నిరోధమును గల్పించుచుండుటయే గాక వేనకు వేలు యినాం గ్రామ రైతులను కేవలము కూలివాండ్రను గావించుచున్నది.

### అభివృద్ధి - మరామత్తులు.

జమీన్ భూములకభివృద్ధిని గల్గించుటను గూర్చియు జలాధారములకు మరమ్మతుల జేయించుటను గూర్చియు, సెలెక్టుకమిటీవారెట్టి యుపయోగకరమగు సూచనలను గావించలేదు. భూస్వామి యేదైన యభివృద్ధి గావించు నెడల అందులకు ప్రతిఫలముగ రైతుతో యెక్కువ పన్ను నిచ్చుటకు ఒడంబడిక చేసుకొనవచ్చునని యభిప్రాయపడెను. ఇయ్యది వ్యవసాయపు ప్రధానమునకు క్రొత్త సూత్రము. వ్యవసాయాభివృద్ధికరములగు దోహదములు రైతుకు భూస్వామి చేయకున్నచో నతని కసలు పన్ను నొసగు టెందులకు? వ్యవసాయ నిర్వహణమందును, భూమి యభివృద్ధి పరచుటయందును భూస్వామి రైతుకు తోడ్పడవలసినది. సాధారణ ధర్మము. అ ధర్మ నిర్వహణమునకు క్రొత్త లాభము లెందుకో? మరమ్మతుల విషయమై కలెక్టరు విచారించిన తరువాత భూస్వామి రిపేరు గావించకున్నచో నంజతీర్వనుమాని పుంజతీర్వనే రైతు లిచ్చుకొనవలసినదిగా మార్పు చేసిరి. మార్పు పూర్వముకంటె రయితు కెట్టిలాభమును చేకూర్చజాలదు. జలాధారము లేకున్న నంజభూములలో పైరుపెట్టుట బహుకాలా లరుదు. ఎచ్చటనో గాని నీటి యాధారములున్న తప్ప పుంజ పైరులు నంజలో గావించుట లేదు. మీదు మిక్కిలి వ్యవసాయ మభివృద్ధి జెందవలయునన్నను, రయితు నంజకు కాధారము లగు వివిధధాన్యములను పండించవలెనన్నను జలాధారములకు మరమ్మతు మిక్కిలి అవసరము. మరమ్మతులను రైతులు గావించుకొని ప్రతిసంవత్సరమును పన్నులో చెల్లుబెట్టుకొను పద్ధతి నింతవరకు యిరువది నాల్గు వత్సరములలో యే యెస్టేటు నందును అవలంబింపబడి యుండలేదు. కానుకాను యెస్టేటు నందునంతె, వినోదములయందును, యెక్కు డభిమానమును జూపుచున్న జమీందార్లు క్రొత్తపెట్టుబడితో మరమ్మతులను గావించుచున్న పుంజతీర్వనే రైతొసగుటకు నిశ్చితులగుదురని సందియమగుచున్నది. ఇట్టిపరిస్థితులలో మరమ్మతు న్యాయమనతో చేయించిన భూస్వామినుండి ఎస్టిమేటు మొత్తమును రాబట్టి

### జమీన్ రయితులవారము.

అక్టోబరు 23 నుండి 30 తేదివరకు

ప్రభుత్వమువారి ఎస్టేటు ల్యాండు బిల్లును పర్యాలోచించిన సెలెక్టుకమిటీవారి నివేదిక ప్రకటింపబడినది. రయితుల కెట్టి యనుకూలమును నివ్వకపోగా భూస్వాముల కధికారమును పెంచుచున్నది. మీదు మిక్కిలి యిట్టిచట్టమున కిప్పుడవసరము లేదు. ఈచట్టము కౌన్సిలులో చర్చింపబడుచో రయితుల బిల్లు ఒకసంవత్సరకాలము రూల్సు ప్రకారము చర్చించుటకు వీలులేదు. అందుచే యీబిల్లుని జమీన్ రయితులు ఆందోళన సల్పవలయును. ఇందుకొరకు అక్టోబరు 23-వ తేది నుండి 30-తేది వరకు జమీన్ రయితుల వారము జరుపవలయునని యీ సమయమున జమీన్ రయితులు దేశమంతటను సభలను జరిపి ప్రభుత్వవారి బిల్లు నాపవలసినదిగ తీర్మానములకేని పత్రికలకును ప్రభుత్వము వారికిని పంపవలయు విన్నవించుచున్నాము.

వి. వి. సుందరవరదులు.
కార్యదర్శి.

---

ప్రభుత్వమువారే రిపేరు గావించునట్లు ఆదేశించియుండిన బాగుండెడి కాని మినహాయింపు జూపు కొంతమాత్రమును సంతృప్తికరము కాదు.

### పట్టా మార్పిడల.

పట్టా మార్పిడల విషయములోగూడ సెలెక్టుకమిటీవారు చాలినంత దూరదృష్టిని గనపరుప జాలకపోయిరి. ఎంతటి స్వల్పవిస్తీర్ణములైనను మార్పిడల కోరినప్పుడు ముందు ఉన్న బాకీలను క్రొత్తరైతు వద్ద వసూలు గావించుకొనెడి పద్ధతితో పట్టా మార్పు గోరునెడల అట్లు గావింపబడవలెనని సెలెక్టు కమిటీవారు నిశ్చయించిరి. బాకీలులేని సందర్భమునగూడ అధికారులు పట్టాలను మార్పకుండ మార్పు దరఖాస్తులను బుట్టదాఖలా గావించిన సందర్భములనేకములను నేనెరుంగుదును, స్థానికముగ కక్షలబెట్టుటకును, స్వకార్యసిద్ధికొరకును భూస్వాము లిట్లు గావించుట సర్వసాధారణము. అందుచే పట్టా ప్రాప్తగు నోటీసు యిచ్చిన పిదప మార్పు చేయకపోయినచో పన్ను వసూలు బాధ్యత భూస్వామికి లేకుండ జేయవలసిన యవసరము గలదు.

అన్యాయకరములగు రుసుములను వసూలు జేయుట యను నేరమింతవరకు శిక్షార్హమైయుండెడిది. అట్టాని తీర్మానమును సెలెక్టు కమిటీవారు తగ్గించిరి. ధాన్యపుకొస్తులు, అడవి కంచెమున్నగువాని యందలి హక్కుబాధ్యతలు వీనియందు సెలెక్టు కమిటీవారెట్టి అభివృద్ధికరములగు సూచనలను గావింపరైరి. పన్నువసూలునకు కఠినమగు పద్ధతుల నవలంబించుటకు భూస్వాములకు హక్కుండవలయునని డాక్టరు సుబ్బరాయనుగారు సూచించిరి. ఇట్టివిపరీతమైన సూచన లింకెన్నెనిగలవు. కావున నే యీ బిల్లు రయితుల కెట్టి మేలునొడగూర్చజాలదని నుడువవలసివచ్చినది! ఇట్టి బిల్లును శాసనమయి నిప్పుడా తురకన్పుచేవలసిన యావశ్యకత లేదు. జమీందార్ల ఆదుపు ఆజ్ఞలలోనున్న ప్రస్తుతపు కౌన్సిలునందు రైతులకు ఘోరమైన అపకారము జరిగితీరును. అదియుగాక యీబిల్లులో నిర్ణయింపబడియున్న సెక్షనులకు రయితు బిల్లు సవరణలను కౌన్సిలు సూత్రముల ప్రకారము సంవత్సరకాలమువరకు ఉపపాదింప వీలులేదు. కాబట్టి యీబిల్లు నెంబరు 2-3 తేదులలో కౌన్సిలునందు చర్చింపకుండ జూచుట జమీన్ రయితుల కత్యవసరమగు ధర్మమై యున్నది.

తరుణమును జారవిడిచిన జమీన్ రయితులు పిదప పశ్చాత్తాప తప్తులు గావలసివచ్చును.

---

# తూర్పుగోదావరి జిల్లాబోర్డు తాలూకా బోర్డుల ఎన్నికలు.

---

### ప్రయత్నములు.

తూర్పుగోదావరిజిల్లాబోర్డుకు మొత్తము 52 స్థానములునియమింప బడినవి. క్రొత్తతాలూకా బోర్డులు మూడునిర్మింప బడినవి. జిల్లాబోర్డుకు, తాలూకాబోర్డులకు ఆగష్టు 17-వ తేదిని దరఖాస్తులు తీసుకొనబడినవి. సెప్టెంబరు 17-వ తేదీని ఎన్నికలు జరిగినవి. ఎన్నికలప్రయత్నములో తునితాలూకా బోర్డుకు తునిరాణీగారు వారితాశీల్దార్లను నిలువబెట్టినట్లుగా నారు. పిఠాపురంతాలూకాబోర్డుకు పిఠాపురం రాజాగారువారి భావమరిదిని తాశీల్దారును,మునసబులను వారి ఆశ్రితులను ,నిలువబెట్టి. తాలూకాబోర్డు లోని పన్నెండు (12)స్థానములనుపూర్తిగా గెలిచిరి. వీరిప్రతిపక్షులు రైతుపక్షమువారు. శ్రీచెలికాని ధర్మారావు (కొరట్లా )జనాబ్ ఉమర్ ఆలీషా పిఠాపురం రాజాగారి మునసబు,చక్రవర్తుల పద్మరాజుగారు వీరు ఓడిపోయిరి. జిల్లాబోర్డుకు రాజావారి భావమరిది దామెర సీతారామస్వామిగారు రాజాగారి తాశీల్దారు, పిల్కారి సెట్టి రంగంబహ్మనాయుడుగారు, వారిపెత్తందారు మల్లాసురియ్య, గ్రామకాకరు వంగనుదురు పి. అప్పయ్యగార్లు ఎన్నుకోబడిరి. రామచంద్రపురం రాజాగారు శ్రీ రాజావత్సవాయి వెంకటగోపాలా రాజాగారు రామచంద్రపురం తాలూకానుండి జిల్లాబోర్డుకు నిలువబడిరి. వీరిప్రత్యర్థి ద్రాక్షరామవాసిని సాకి సీతారామయ్యసామాన్యరైతు (ప్రజాపక్షవాది) యిచటయెకవిధ జరిగినది. సెప్టెంబరు 17వ తేదీని ఎన్నికరోజున ద్రాక్షారామపోలింగు స్టేషనులో సీతారామయ్యగారికి హెచ్చుఓట్లువచ్చుచుండినవి. (మాటికి దెబ్బది) మధ్యాహ్నము 12 గంటలకు సీ రామయ్యగారిని పోలీసువారు నిర్బంధించి రాత్రి ఎనిమిదిగంటలకు విడుదలజేసిరి. రామచంద్రపురం రాజాగారు సుమారు 150 ఓట్లు హెచ్చుచేగెలువగలిగిరి. రామచంద్రపురంరాజాగారి తమ్ముడు తాలూకాబోర్డుకు గట్టిప్రయత్నముచేయుచున్నారు. ఎన్నికతేదీయింకను ప్రచురింపబడలేదు. వీరికిపోటీ ప్రజాపక్షఅభ్యర్థి జక్కాని వెంకటరత్నంగారు, కాని వెంకటరత్నంగారు 500 ఓట్లు హెచ్చు చేగెలువగలరని ఊహ. కాకినాడతాలూకాబోర్డుకు 20 స్థానములుఅందు ఎనిమిదిప్రజాపక్షము వారిపరమైనవి. పిఠాపురంరాజాగారి కాకినాడతాలూకా తాశీల్దారైన వాడ్రేవుసుబ్బారావుగారు యెన్నుకోబడిరి. ప్రజాపక్షమువారు పెట్టిన వాలుగు స్థానములలో తాశీల్దారు, కమిస్యూరశెన్యస్టరు తిమ్మానుగారు స్వయముగా ప్రచారము చేసి నలుగురు జాతీయవాదులను ఓడగొట్టిరి వారిగ్రామముల లో రాజావారిపలుకుబడి వంతయునిని సాగించుచున్నారు. పెద్దాపురంతాలూకా బోర్డుకు పన్నెండుస్థానములు గాకెక్కిసంబెంటు చేసిన తోటవరహాలయ్య (జస్టీసు)గారిని, వారితమ్మునుపూర్తిగా, పంతులరాజు (కా) తాశీల్దార్లా యయ్య రావుగారిసహాయములో ఓడగొట్టిరి.

రామచంద్రపురం తాలూకాబోర్డుకు కారణాంతరముచే 17-వ తేదీనిఎన్నికలుజరుగక, అక్టోబరు 3 వతేదీని 6స్థానములకుపోటీజరిగినది. అందుప్రస్తుతము జిల్లాబోర్డుప్రెసిడెంటు మల్లిపూడి పళ్ళంరాజు (గారు)కిప్రత్యర్థి నున్న సత్తెప్పనాయుడు ఏ కారణముచేనైనను మల్లిపూడి పళ్ళంరాజుగారు తాలూకాబోర్డుకు జిల్లాబోర్డుకు ఎన్నుకోనబడకూడదని ప్రయత్నముచేసి, వీరు జిల్లాలో అవకేటివు బ్యాంకి డైరక్టరనియు, అందుచే జిల్లాబోర్డుకు, తాలూకాబోర్డుకు నిలువకూడదని ఎలక్షన్ ఆఫీసరు దరఖాస్తు త్రోసివేయుటయు అందుపై వీరు దావాచేయుటయు కాకినాడ సబ్ కోర్టు. మునసబుగారు 30-వ తేది శుక్రవారము తీర్పుచెప్పుచు పళ్ళంరాజుగారికి ఖర్చులక్రింద రూ 300 మున్నూరురూపాయలు ప్రతివాదులచే యిప్పించిరి. 3-వ తేది సోమవారము తాలూకాబోర్డు ఎలెక్షన్ రోజు తెల్లవారినుండి తుని కొత్తరాజావారి తమ్ముడువారి భావమరిది, ప్రచారము సలిపిరి. పిఠాపురం దివాన్ కోకా సుబ్బారావు నాయుడు, వారి తాశీల్దారు వాడ్రేవు సుబ్బారావు, వారి కమిస్యూ ఇన్స్పెక్టరుగార్లు ఆదివారం సాయంత్రం వారిగ్రామములో రయితులకు గట్టి బోధచేసిరి. వీరిపోటీదారు రామచంద్రపురం రాజావారి పక్షమువారు. వారుతీవ్ర ప్రచారము చేయుటకింక చోటులేదు. దొడ్డంపేట జమీందారగు శ్రీరాజా వాడ్రేవు విశ్వసుందరరావుగారు (బి.ఏ) వారి గ్రామములో గట్టిపనిజేసిరి. రామచంద్రపురం రాజాగారు శెట్టిబలిజ సంఘములో చీలిక పెట్టిరి. జిల్లాబోర్డుకు తునిరాజావారి పక్షము ముగ్గురు, పిఠాపురం రాజావారివి నలుగురు, రామచంద్రపురం రాజావారివి నలుగురు జిల్లాబోర్డుప్రెసిడెంటు పదవికి ప్రయత్నము చేయుచున్నారు.

---

(రెండవ పేజి కొరవ.)

వరములో నేమి నేర్చుకొందురోగాని, వృత్తి నవలంబించిన పిదప ధనార్జన తప్ప వేరొక యీ దర్శమును దృష్టియందుంచుకొనుట లేదని స్పష్టమగుచున్నది. ఈ యవకతవకలకు ముఖ్యకారణము ప్రధానోపాధ్యాయుని విరంకుశ ప్రవర్తనమే! ఒకప్పుడు పరుల యభిప్రాయముల గైకొనవలసివచ్చినను, తనముఖ్య యనుచరులగు సహాయోపాధ్యాయుల గాని, లేక ప్రథమ, ద్వితీయ, తృతీయ సహాయోపాధ్యాయుల యభిప్రాయములనే గైకొనును. అసలు తరగతికి వెళ్ళి, బోధించువాని యభిప్రాయమును సరకుచేయడు! ఆలోచించిజూడ, వీరు గ్రంథకర్తయొక్కగాని ప్రచురణకర్తయొక్కగాని ఒత్తిడికి లోబడిపోయి ఇట్లు గావించుచున్నారని విశదపడుచున్నది. ఈ పఠనీయ గ్రంథనిర్ణయము రచయితా, ప్రకాశకులకే నిర్ణేతలతో యుండు స్నేహసంబంధముల ననుసరించియుండును. అదియుగాక, కొందఱుపాధ్యాయులు సోమరులై సెలవులకు ముసుపు నిర్ణయించక, సెలవులైన తర్వాత ప్రాలుమాల ఇది వఱకున్న దానినే యుండనిచ్చెదరు. ఊరిలో యొకమాట వినబడుచున్నది. ఈ మాక్మిలన్ మొదలగు కంపెనీల యేజంట్లు చెన్నపురి నివాసులగుటచే, అచ్చట చాల పలుకుబడి గలవారై యున్నారు. ఆ కంపెనీల పుస్తకముల నెవరుపాధ్యాయులెట్లయినను యిచ్చుట పఠనీయ గ్రంథములుగ నిర్ణయించి, చాలప్రతుల నమ్మకపోనిచ్చినచో, ప్రత్యుపకారముగ ఆయేజంట్లు వీరికి ఎస్. ఎస్. ఎల్. సి. పరీక్షలలో సహాయ పరీక్షకులగా నియమింపబడుటకు సహాయపడుదురనియు, లేక కంపెని యధికారులనుండి మంచికమీషన్ నైనను పడవేయించెదరనియు. ఇది ఎంతవాస్తవమో చెప్పలేముగాని మంటలేనిదే పొగరాదను లోకోక్తి ననుసరించి దీనిలో కొంత నిజము నుండవచ్చును.

---

( 1-వ పేజీ తరువాయి )

ఫిర్కా విషయంలోనే మొదటినుంచి వుండి న ఏ గిరాయకోసం పోలింగుస్టేషన్ను లీ సి పాఠ్యశాలలో ఏర్పరచినందుకు హైకోర్టులో దావా జరిగి సర్కారువారికి ముప్పై రూపాయల ఖర్చులు నెత్తిపై బడి నవి.

* * *

ఇంకా యేమైనా దావాలువచ్చి కొన్ని ఫిర్కాలలో మెంబర్లనులే నిలుప బలుగు వస్తుందేమో నని నవంబరు నె 22 వ నుంచి డిసెంబరు నె 12 వ వరకు జిల్లా కంతటికి మెంబర్లనుల వాయిదా వేయబడి ది నామినేషను నవంబరు నె 14 వికి మా ర్చబడినది. పేర్లకు మంచిదినాలు ఇంకా కొన్ని మిగిలి వున్నవన్నమాట!

---

## అఖిలభారతచరఖాసంఘము, ఆంధ్రశాఖ.

---

జిల్లాలందొల్ల కాంగ్రెసు కమిటీ వారున్ను అటుపిమ్మట జిల్లా ఖద్దరు బోర్డువారున్ను నెల్లూరుజిల్లాయందు నూలువడికించుట, నేయించుట, వీటిని చేయించుచుండిరి. వ్యాపారమునకు నష్టమేమియులేక జిల్లా నాయకులయినవారు ఖద్దరు ఉత్పత్తి విక్రయములకు విశేషముగ తోడ్పడిరి. నానాటికి ఈఖద్దరు పరిశ్రమ నెల్లూరు జిల్లా యందు అభివృద్ధిగాంచెను. ఇంతియగాక కనుపూరు సెంటరులో తయారగు వస్త్రములు మిక్కిలి నాజూకుగా నుండుటచే ఈబట్టలను గుంటూరు, కృష్ణా, మొదలగు జిల్లాలవారు విరివిగా కొనుచుండిరి. జిల్లాఖద్దరుబోర్డువారు కొన్ని ఇతర జిల్లాలవారివలె ఆంధ్ర ఖద్దరుబోర్డుకు నష్టము చేకూర్చక సదరు సంస్థను జరిపిరి. అటు పిమ్మట ఈపైసంఘము స్థాపితమైనపిమ్మట పనికొన్ని సామ్మె ఈజిల్లాలో పెట్టుబడిపెట్టిరి. అదిమొదలు కనుపూరు, సర్వేపల్లి, ముత్తుకూరు, బుచ్చిపాడు, పల్లిపాడు, కావలి, కొమ్మి, కందుకూరు, కనిగిరి తాలూకాలలో మరియు అనేకచోట్ల ఈసంస్థవారు అనేకులు తోడ్పడిరి. మహాత్ముని గారు నెల్లూరి జిల్లాకు విజయం చేసినపుడు ఈజిల్లాలోని అవకాశములను బట్టి ఎంత సొమ్మైనను ఇచ్చెదనని వాగ్దానముచేసిరి.

అటుపైన కొంతద్రవ్యమును చరఖా సంఘమువారు నూతనముగా పెట్టుబడి పెట్టిరి. ఉత్పత్తి విక్రయములు అధికమాయెను. అఖిల భారత చరఖాసంఘపు కార్యదర్శియగు శ్రీయుత బ్యాంకరు గారు 1929 లో ఈ పల్లెసంస్థలను పరిశీలించి కనుపూరు రకమువంటి సన్నబట్ట భారత దేశమందెచ్చటను ఇంతవిరివిగా తయారగుట లేదనియు, కందుకూరు, కనిగిరి మొదలగు పడమటి తాలూకాలలోని ఉత్పత్తి అవకాశములను చూచి ఈప్రాంత్యములు ఇండియాకు మాంచెష్టరు అనినుడివిరి. ఈ ఉద్యమముగలి నేటిపెట్టున్నదో చూడుడు. ఉత్పత్తిస్థానములు తగ్గింపబడినవి దూదేకులవారు, వడకువారు, నేతగాండ్రు తమకు కల్పింపబడిన పనులనుండి నివర్తింపబడిరి వారందరు ఈ కంపినీ దివాలాయెత్తినదని అపఖ్యాతిగా దేశమునందంతటను వ్యాపింపచేసిరి.

నెల్లూరుజిల్లాలో ఉండునది విక్రయశాల ఒక్కటిమాత్రమే ఇచ్చట విక్రయములు కావడములేదు.

ఈ దుస్థితికి కారణములు మరొక వ్యాసమునందు వివరించెదను ఈ దుర్గతికి కారణములు ప్రజాసమూహమునకు విదితమగునట్లు పత్రికా మూలమున తెలుపకోరినాను.

ఇట్లు,
తూములూరు పద్మనాభయ్య.
28—9—32.

---

## వెంకటగిరి

---

సర్కిల్ ఇన్ స్పెక్టరు.

---

వెంకటగిరిలో సర్కిల్ యిన్ స్పెక్టరు వారుగానున్న కె. వి. సుబ్బరావుగారిని మా స్వవాలిస్థానమున మహీపాలసింగ్ గారిని వేసిరని తెలియుచున్నది. సుబ్బరావుగారు న్యాయవిచక్షణలో సమర్థులు. రయితులకును, జమీందారుగారికి జరుగుచుండిన పోరాటములో నిపుణతగా పనిచేసిరి. ఉభయపక్షములవారికి నచ్చచెప్పి రాజీపరిష్కారమునకు కొంతవరకు సహాయకుడిరి. వీరు లేని లోటుతీర్చుటకు మహీపాలసింగుగారు వచ్చుచున్నారు. వీరు అత్యంతఉత్తములని పేరు ప్రఖ్యాతును సంపాదించిన శాంతచిత్తులు. జమీందారుగారికిని, రయితులకును రాజీపరిష్కారముజరుగుచుండు యిట్టిపరిస్థితులలో వివాదములు పెంచని నిష్పక్షపాతులుండుట చాలాఅవసరము.

---

రాజీ పరిష్కారము.

—(౦)—

వెంకటగిరి రయితులకును, జమీందారుగారికిని జరుగుచుండిన పోరాటము పరిసమాప్తమైనదిగాని రాజీమూలసూత్రము లింతవరకును పూర్తికాలేదు. మెలెక్షను నరకు నెట్టమని యేస్టేటువారికి వారిఉద్యోగులు సలహానిచ్చుచున్నారట. ఈచిక్కులను గొని తెచ్చిపెట్టు ఉద్యోగుల మాటవినిని పెట్టక. వెంటనే రాజీవిషయముల పరిష్కరించి రయితులమన్ననలకు పాత్రులయ్యెదరని కోరుచున్నాము.

---

ముద్రాపకుడు, సంపాదకుడు, ప్రకాశకుడు:—నెల్లూరు వెంకటాద్రినాయుడు, జమీందారీరయితు ముద్రాక్షరశాల, గాంధిపాక్, నెల్లూరు.